# మత్స్య మిత్రుడి మంత్ర మహిమ

## రష్యాదేశపు జానపద గాథ

పునఃకథనం:
ఎమ్. బులాతోవ్





నగనగా ఒక పల్లెటూరిలో ముగ్గురు అన్నదమ్ములు వున్నారు. పెద్దవాళ్లిద్దరూ తెలివైనవాళ్లు. చిన్నవాడు యెమేల్యుష్క పాపం వెర్రివెంగళాయి. ఒకసారి పెద్దవాళ్లిద్దరూ పట్నంలో జరుగుతూన్న సంతకి వెళ్దామని మూట ముల్లె కట్టుకుని ప్రయాణానికి సిద్ధమై, యెమేల్యను పిలిచి, వాడితో ఇలా అన్నారు:

''ఒరేయ్ యెమేల్యా! నువ్వు ఇంట్లో బుద్ధిగా వుండు. బద్ధకించకు. పొయ్యి తీనె ఎక్కిపోయి ముసుకుతన్ని పడుకోకు; వదినెలు చెప్పినట్టల్లా విను. అలా చేస్తే నీకు మంచి బహుమతులు – కొత్త బూట్లూ, కొత్త జుబ్బా, మరిగంటే – షోకైన ఎర్రని టోపీ – తీసుకొస్తాం. ఏం, తెలిసిందా?''

''సరే, వదినెగార్లు చెప్పినట్టల్లా వింటాను'' అన్నాడు యెమేల్య.

అన్నలు ఇద్దరూ వెళ్లొస్తామని ఇంట్లో చెప్పి, బయల్దేరి వెళ్లిపోయారు.

కాస్సేపయాక వదినెలు ఇద్దరూ యెమేల్యను పిలిచి:

''యెమేల్యుష్క! ఏటికెళ్లి నీళ్లు పట్టుకురా, ఇంట్లో ఒక్క చుక్క అయినా నీళ్లులేవు'' అన్నారు.

పొయ్యి తీనె ఎక్కిపోయి, ముసుకుతన్ని పడుకున్న యెమేల్య:

''అబ్బా, నే వెళ్లను!'' అనేశాడు.

''వెళ్లనంటే ఎలా మరి? మాకు సాయం చేస్తానని మాట ఇచ్చావుగా!''

''అయితే సరే!'' అన్నాడు యెమేల్య.

యెమేల్య పొయ్యి తీనె మీదనుంచి దిగి, జోళ్లు తొడుక్కున్నాడు, చేనేత బూర్నీసుకోటు వేసుకున్నాడు, పటకాతాడు నడుముకి బిగించి, అందులో గొడ్డలి దోపుకున్నాడు, కావడిబద్దకు బాల్చీలు తగిలించాడు, కావడి బుజాన వేసుకున్నాడు – ఇక అప్పుడు ఏటికి బయల్దేరాడు.

యెమేల్య కొంత దూరం నడిచివెళ్లి, ఎత్తుగా వున్న ఏటిగట్టు దిగి, ఏటి వొడ్డుకు వెళ్లాడు. చలికాలం అవడంచేత ఏరు గడ్డకట్టుకుపోయింది. సరే అని చెప్పి యెమేల్య నీళ్లకోసమని మంచు పొరను గొడ్డలితో పెట్టగొట్టి, బాల్చీ దించేందుకు సరిపోయేటట్టుగా చుట్టూ కన్నం చేశాడు. కన్నంలోంచి నీళ్లల్లోకి

చూసేసరికల్లా — పెద్ద చేప ఒకటి యెమేల్యాకి కనబడింది. యెమేల్యా చప్పున నీళ్లలో చెయ్యిపెట్టి, చేప తోక దొరకపుచ్చుకుని, నీటిలోంచి దాన్ని పైకి తీశాడు.

ఆ చేప మనిషిలాగానే మాట్లాడుతూ:

''ఓరి, వెర్రివెంగళాయా! నన్ను పట్టుకున్నా వెందుకు?'' అని అడిగింది.

''ఎందుకు పట్టుకున్నానని అడుగుతున్నావా? నిన్ను తీసుకెళ్లి, మా వదినెగార్లకి ఇస్తా, వాళ్లు నా కోసమని నిన్ను వండి, కమ్మని పులుసు కాచి పెడతారు'' అన్నాడు యెమేల్యా.

ఆ మాటలు విని, పాపం చేప యెమేల్యాను బతిమాలింది:

''బాబ్బాబు! నన్ను చంపేయకు. నన్ను మళ్ళీ నీట్లో పడేయ్ నాయనన్నాయన, నీకు పుణ్యముంటుంది! నన్ను రక్షించావంటే నిన్ను లక్షాధికారినీ, కోటీశ్వరుణ్ణీ చేస్తాను!''

''నీ లక్షలూ, కోట్లూ నా కక్కర్లేదు. నీ డబ్బూ దస్కం నాకు లేకపోయినా నేను హాయిగా బతుకుతాను'' అనేశాడు యెమేల్యా.

''పోనీగాని, నువ్వు ఆడిన మాటల్లా జరిగేటట్లు నీ కొక వరం ఇస్తాను — మాట అనేముందు మాత్రం నువ్వీ మంత్రం ఉచ్చరించాలి: 'మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం'' అని చేప ప్రాధేయపడింది.

''సరే — అలాగే మరి!'' అన్నాడు యెమేల్యా.

అలా అని యెమేల్యా ఆ చేపని నీట్లో పడేసి:

''మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం'' అని మంత్రం ఉచ్చరించి, ''ఓ బాల్చీలూ! మీరు నీళ్లు నింపుకుని, మీ అంతట మీరే ఇంటికెళ్లండి!'' అని ఆజ్ఞాపించాడు.





ఆ మంత్ర వాక్యం యెమేల్య నోటంట ఇంకా వచ్చిందో లేనేలేదో – బాల్చీలు వాటంతటవే నీళ్ల నింపుకుని, ఎత్తుగా వున్న ఏటి గట్టు ఎక్కిపోయి, బాతులకు మల్లే అడుగులు వేసుకుంటూ ఇంటి ముఖం పట్టాయి. యెమేల్య కూడా నవ్వుకుంటూ వాటి వెంబడే వెళ్ళాడు.

ఇరుగు పొరుగు వాళ్లందరూ ఇల్లూ వాకిలీ, కొంపా గోడూ వదిలిపెట్టి, వీధిలోకి పరుగున వచ్చి, ఆ విడ్డూరాన్ని చూసి, ముక్కు మీద వేలేసుకుని, ఆశ్చర్యంతో అలా నిలబడి పోయారు.

''చూడండి, చూడండి, యెమేల్య ఎలాంటి గారడీలు చేస్తున్నాడో! వాడి బాల్చీలకి కాళ్లొచ్చి, వాటంతటవే నడుస్తున్నాయ్! ఎక్కడా జోగిపోవడం లేదు, తూలిపోవడం లేదు, ఒక్కచుక్క అయినా నీళ్ల తొణికిపోవడం లేదు!'' అంటూ వాళ్ల చెప్పుకొని అదే విస్తుపోయారు.

యెమేల్య వదినెగార్లు ఇదంతా చూసి:

''మన యెమేల్య వెర్రివెంగళాయ కాదే! అయ్య బాబోయ్, ఏకంగా బాల్చీలనే నడిపించేస్తున్నాడు! ఇది ఇంద్రజాలమూ మహేంద్రజాలమూనూ!'' అని గుసగుసలు చెప్పుకున్నారు.

బాల్చీలు రెండూ గుడిసె దగ్గరకు చేరుకుని, వీధిగుమ్మం మెట్లెక్కి, ఎక్కడా ఒక్క నీటి బొట్టు అయినా తొణకరించకుండా, పెరటి వైపున వున్న వసారా బెంచి మీద నెమ్మదిగా చతికిలబడ్డాయి.

ఇదంతా అయాక యెమేల్య తన చేనేత బూర్నీసుకోటు తీసేసి, జోళ్ల విప్పుకుని, పొయ్యి తినె ఎక్కిపోయి:



''వదినెగార్లూ! ఇదేమిటి? పొయ్యి ఆరిపోయి చల్లబడి పోయింది!'' అన్నాడు.

''అవును, పొయ్యిలోకి కట్టెలు నిండుకున్నాయి, ఏం చెయ్యమంటావ్ మరి? నువ్వు పొయ్యి తీనె దిగి, అడవికెళ్లి, కట్టెలు కొట్టి తీసుకురా. అప్పుడు పొయ్యి రాజేస్తాం'' అన్నారు వదినెలు.

'అబ్బా, నే వెళ్లను!'' అనేశాడు యెమేల్య.

''అదేమిటి, వెళ్లను అని అదే ఊతపదమా? సరే, ఆ బహుమతులేవో నీకు అక్కర్లేకపోతే, ఆ చల్లారి పోయిన పొయ్యి తీనె మీదే పడుకో — మాకేం పోయింది!'' అన్నారు వదినెలు.

పాపం, యెమేల్యకి ఏమనడానికీ వీల్లేకపోయింది. మరిక లాభం లేదని, యెమేల్య పొయ్యి తీనె దిగిపోయి, జోళ్లు తొడుక్కుని, చేనేత బూర్నీసుకోటు వేసుకుని, గుడిసెలోంచి పైకొచ్చి, అడవికెళ్లి కర్రలు కొట్టి తెచ్చేందుకు సిద్ధమైయాడు. పాకలోకెళ్లి స్లెయ్ బండిని తీసుకొచ్చి, గొడ్డలీ, రంపమూ, పెద్ద తాడూ — వీటన్నిటినీ స్లెయ్‌లో పడేసుకుని, తను కూడా స్లెయ్‌లో ఎక్కి కూచున్నాడు.



‘‘ఏమండోయ్ వదినెగార్లూ! గేటు బారుగా తెరవండి — నేను స్లెయ్ మీద అడవికి వెళ్తున్నా!’’ అని యెమేల్య కేకేశాడు.

‘‘ఆరె, నీ బొడ్డు పొక్కా! నీ బుద్ధి బూరెలు తింటూాందా ఏమిటి? గుర్రానికి జీనువేసి, దానిని స్లెయ్‌కి కట్టందే అడవికి వెళ్తానంటావేమిటి? బాగు బాగు! గుర్రానికి జీనువేసేందుకు నీకు మేం సాయం చేస్తాంలే. ఉండు ఒక్క నిమిషం!’’ అన్నారు వదినెలు.

యెమేల్య మాత్రం స్లెయ్‌లో కూచున్నవాడు లేవకుండానే:

‘‘గుర్రాన్ని కట్టడమెందుకు? దాన్ని చూస్తే నాకు జాలి వేస్తుంది! గుర్రాన్ని కట్టకుండానే వెళ్తుంది నా స్లెయ్! గేటు తెరవండి!’’ అన్నాడు.



యెమేల్యా మాటలు విని వదినెలు ఆశ్చర్యపడ్డారు. కాని అలా ఆశ్చర్య పడుతూనే గేటు తెరిచారు. యెమేల్యా మెల్లగా మంత్రం ఉచ్చరించాడు:

"మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం, ఓ స్లెయ్, నీ అంతట నువ్వే పరుగెత్తి అడవికి వెళ్ళు!"

ఇంకేముంది, ఆ స్లెయ్ తననెవరో మూడు జాటీల కొరడాతో బాదుతూన్నట్టుగా, ఝూమ్మని పరుగెత్తింది. ఆ జోరుకి స్లెయ్ కమానుకర్రల కింద మంచు కర కర కరమని ధ్వనించింది!

రంయ్ రంయ్‌మని స్లెయ్ గూడెం మధ్యనుంచీ, గ్రామం నడివీధిలోంచీ దౌడు తీసింది— స్లెయ్‌కి ఇరుపక్కలా వున్న ఏరుకాళ్ళు రెండూ ఇటూ అటూ వేలాడిపోతూ అల్లల్లాడిపోతున్నాయి. వాటిని కదలకుండా కట్టివేయడమే మరచిపోయాడు యెమేల్యా.

ఆ రోజు గ్రామంలో ఉత్సవం జరుగుతూంది — ఇసుకవేస్తే రాలనట్టు వున్నారు జనం. జన సమ్మర్దంలోంచి ఆ స్లెయ్ పరుగెత్తుతూండడం చూసి — గుర్రం లేకుండానే స్లెయ్ దానంతటదే పరుగెత్తుతూందే,



ఇదేదో మహా చోద్యంగా వుంది, చూదామంటే చూదామని — దాని వెంటబడ్డారు జనం. కొందరు దాని వెంట పరుగెత్తారు, దానికి ఈ వైపూ ఆ వైపూ పరుగెత్తారు కొందరు. కొందరు తొట్రుకుని దాని కింద బోర్లా పడుతున్నారు. అటూ ఇటూ వేలాడుతూ అల్లల్లాడిపోతూన్న ఏరుకాళ్ల మనుషుల్ని తోసి పారేస్తున్నాయి. అవి తగిలి చాలామంది బోల్తాకొట్టి కింద పడ్డారు, అనేకులు మంచు గుట్టల్లోకి దొర్లిపోయారు. అందరూ దిగ్భ్రాంతి చెందిపోయారు. యెమేల్యను పట్టుకుందామని అందరూ స్లెయ్‌ని వెంబడించి, దానిని ఆపి వెనక్కి తీసుకువచ్చేందుకు ప్రయత్నించారు, కాని దానిని ఎవ్వరూ పట్టుకోలేకపోయారు — అందరినీ మించి పరుగెత్తుతూంది ఆ స్లెయ్.

స్లెయ్ అడవి చేరుకుని, అక్కడ ఆగింది. యెమేల్య స్లెయ్ లోంచి దిగి, నాల్గు చెరగులా కలియజూసి, మంత్రోచ్చారణ చేశాడు:

"మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం — ఓరంపమా, నువ్వు వెళ్లి, బాగా ఎండిపోయున్న చెట్టును ఎంచి, దాన్ని కోసేయ్! ఓ గొడ్డలీ, నువ్వు వెళ్లి, ఆ చెట్టుబోదెను దుంగల కింద నరికేయ్! ఓ దుంగల్లారా, మీ అంతట మీరు వెళ్లి, గొడ్డలి కింద నిలబడి, దాని చేత చిన్న చిన్న పుల్లల కింద నరికించేసుకోండి! ఓ పుల్లల్లారా, మీ అంతట మీరే స్లెయ్‌లోకి వెళ్లి, మీ అంతట మీరే పేర్చినట్టు పడుకుని, అక్కడున్న తాడుతో మోపు కింద కట్టించేసుకోండి!"

సరే, ఆ అబ్బాయి మాట ప్రకారమే అంతా జరిగింది. రంపం వెళ్లి చెట్టును పర పర కోసేసింది, గొడ్డలి వెళ్లి బోదెను చక్ చక్‌మని చిన్న పుల్లల కింద నరికేసింది, పుల్లలు వాటంతటవే స్లెయ్‌లోకి వెళ్లి, వాటంతటవే పేర్చినట్టు పడుకున్నాయి. అలా పడుకుని తాడుతో బలంగా మోపు కింద కట్టించేసుకున్నాయి. ఇంకేముంది — బయల్దేరి గ్రామం లోంచి వెళ్లి, ఇల్లు చేరుకోవడమే!



దారిలో వున్న మనుషులకి ఏరుకాళ్లు తగిలి వాళ్లు బోల్తాలు పడకుండా వుండేందు కని వాటిని కట్టేసి, యెమేల్యా స్లెయ్‌లో కూచుని కేకేశాడు:

''మత్స్య మిత్రుడి మంత్ర మహిమాను సారం, నా చిత్తానుసారం — ఓ స్లెయ్, నువ్వు దౌడు తీసి, నీ అంతనువ్వే ఇంటికి చేరుకో!''

స్లెయ్ ఝూమ్మని దౌడు తీసింది. ఆ దౌడుకి ధూళి మేఘాల్లా లేచింది మంచు.

ఇక గ్రామంలో జనం, యెమేల్యా మళ్ళీ ఎప్పుడు వస్తాడా, ఎప్పుడు పట్టుకుందామా, అని పడికాపులు కాసి చూస్తున్నారు. కొందరు పెద్దపెద్ద కొడవళ్లు పట్టుకున్నారు, కొందరు పట్టుకార్లు పుచ్చుకున్నారు, మరికొందరు లాఠీలు ధరించి కంచెగోడలా అడ్డుగా నిలబడ్డారు. ఇంకా కొందరు తాళ్లు చేతబూనారు. ఎలాగైనా సరే యెమేల్యను పట్టుకొని, శిక్షించాలని — అడవికి వెళ్తూన్నప్పుడు తమనందరినీ భీతావహులను చేసి, బోల్తాలు కొట్టించి కిందపడిపోయినట్టు చేశాడు గనుక, అందుకు వాడికి తగిన శాస్తి చేసితీరాలని వాళ్లు నిశ్చయించుకున్నారు!

యెమేల్యా వస్తూండడం వాళ్లు చూసి, తాడు విసరి పట్టివేదామని కొందరూ, అమాంతమూ మనిషినే గట్టిగా పట్టే సుకుందామని కొందరూ నిర్ణయించుకుని, అందరూ బిగ్గరగా అరిచారు:

''ఆపండి వాణ్ణి! పట్టుకోండి వాణ్ణి! చేతులూ కాళ్ళూ కలియగట్టేయండి వాణ్ణి!''

ఆపండి, పట్టుకోండి, కలియగట్టేయండి అని అరవడ మేమో అరిచారు గాని, వాణ్ణి నిలవరించడం వాళ్ల తరమా? అయ్య బాబోయ్! ఆ స్లెయ్ వాయువేగ మనో వేగాలతో దూసుకుపోతూంది, ఆ జోరుకి స్లెయ్‌వెంట మంచు రేగి, కుప్పలు తిప్పలుగా పోగడి, ఐపూ జాడా తెలియకుండా బాటను కప్పేశాయి.

స్లెయ్ దౌడాయించి, దౌడాయించి, సరాసరి ఇంటి ముందు గేటు దగ్గర టక్కున ఆగింది. కట్టెపుల్లలు ఒక్కొక్కటే బండిలోంచి గంతువేసి — ముంగిట్లోంచి వెళ్లి, పెరటి పక్కగా నడచి, దొడ్డిదారిని గుడిసెలో ప్రవేశించి, ఒకదాని తర్వాత





ఒకటి చక్కగా దొంౖదుకుంటూ, ఇక్కడా అక్కడా కాదు, సరిగ్గా పొయిగూటి పక్కనే పేర్పుగా ఏర్పడిపోయాయి. ఇక గొడ్డలి, రంపం — రెండూ కలిసి వాటిమటుకవే బెంచి కిందకి వెళ్లిపోయి, హాయిగా పడుకున్నాయి.

ఇదంతా చూసి వదినెలు భయౖభ్రాంతులు అయిపోయారు — ఏమి చేయడానికీ ఏమి చెందడానికీ వాళ్లకేమీ పాలుపోలేదు. భీతావహులై హడలిపోతూ అక్కడకూ ఇక్కడకూ పరుగులెత్తారు, ఆ మూలా ఈ మూలా — ఓ మాటు టేబిలు కిందా, ఓ మాటు మంచాల వెనుకా — దాగున్నారు.

''మీ అన్నయ్యలు వచ్చాక — వాళ్లతో నీ మీద ఫిర్యాదు చేస్తాం, ఏమనుకున్నావో!'' అని బొబ్బరించారు వదినెలు.

యెమేల్య మాౖతం తనలో తాను నవ్వుకుంటూ:

''అలా భయపడిపోతున్నా రెందు కంటా! ఇల్లా వచ్చి, చప్పున నాకు వేడివేడి కేబేజీ పులుసు పెట్టండి — అడవిలో చలికి కొయ్యబారిపోయాను!'' అన్నాడు.

యెమేల్య కేబేజీ పులుసు తాగి, పొయ్యి తీనె ఎక్కిపోయి హాయిగా పడుకున్నాడు. సరిగా అదే వేళకి, ౖగామంలో జనమంతా పోగడి, రాజుగారి దగ్గరికి పరుగెత్తి: ఫలానా ౖగామంలో యెమేల్య అనే వైరివెంగళాయ ఒకడున్నాడు, గుౖర్రాన్ని కట్టకుండానే ఆ కుౖర్రాడు స్లెయ్‌ని తోల్తున్నాడు, ఆ స్లెయ్ జోరుకి మమ్మల్నందర్నీ వాడు హడలెత్తించేస్తున్నాడు, మమ్మల్ని రోడ్డుమీద నడవకుండా బోల్తాలు కొట్టిస్తున్నాడు, మంచు రేగి దిబ్బలుగా పోగడేటట్టు స్లెయ్‌ని తోల్తున్నాడు — అంటూ ఆయన ఎదుట ఫిర్యాదు చేశారు.

రాజుగారు ఇదంతా విని, ఇదేదో మహా చిౖతవిచిౖతంగా వుందే అనుకున్నాడు. ఈ యెమేల్య ఎవడో ఏమిటో తెలుసుకోవాలని ఆయనకి జిజ్ఞాస కలిగింది. ఆ పాళంగా రాజుగారు తన మహాసామంతులలో ఒకరిని పిలిపించి, ౖపజలు తెచ్చిన ఫిర్యాదుకు సంజాయిషీ చెప్పుకుందుకు ఆ యెమేల్యను పట్టి తన సమక్షంలో హాజరు పెట్టాల్సిందని ఆజ్ఞాపించాడు.

రాజుగారి మహాసామంతుడు ఆ ౖగామానికి వెళ్ళాడు. ఐతే ఒక్కడే వెళ్లలేదు — తన పరివారాన్ని వెంటబెట్టుకునే వెళ్ళాడు. పరివార సమేతంగా మహాసామంతుడు యెమేల్య నివసిస్తూన్న గుడిసెకి వేంచేశాడు. గుడిసెలో కాలు పెట్టాడో లేనేలేదో మహాసామంతుడు అధికార దర్పంతో:

''యెమేల్య వైరివెంగళాయ ఎక్కడున్నాడు? తీయికురండి వాణ్ణిలా!'' అని ఆర్భాటంగా పొలికేక పెట్టాడు.



వదినెగార్లకి సగం ప్రాణాలు ఎగిరిపోయాయి. అలా భయంతో బిక్కచచ్చిపోతూనే పాపం వాళ్ళు పొయ్యి తీనె కేసి చూపించారే గాని, భయోద్రేకంతో వాళ్లకు ఏం చెప్పేందుకూ నోట మాట రాలేదు. నిర్భయంగా వున్న వాడల్లా యెమేల్య ఒక్కడే అక్కడ.

''నే నిక్కడ వున్నాను లే, పొయ్యి తీనె మీద కూచునే నిన్ను చూస్తున్నా. ఏం పనిమీద వచ్చావ్?'' అని అడిగాడు యెమేల్య.

''వెర్రివెంగళాయా! కోటు వేసుకోవోయ్, జోళ్లు తొడుక్కోవోయ్ వెర్రివెంగళాయా! నిన్ను ఏకంగా రాజుగారి సమక్షానికి ఈడ్చుకుపోతాం ఖబడ్దార్!'' అంటూ జబర్‌దస్తీగా అరిచాడు మహాసామంతుడు.

''ఫోస్, నే రాను!'' అనేశాడు యెమేల్య.

''ఓహో, అలాగా! ఇంకా మారుమాట కూడానా!'' అని మహాసామంతుడు మండిపడ్డాడు.

మహాసామంతుడు మండిపడి, యెమేల్య మీదకి చెంగున ఒక్క ఎగురు ఎగిరి, చేతి మడమతో తీసిపెట్టి ఛెళ్ళున ఒక లెంపకాయ వాయించాడు.

''వీణ్ణి పట్టుకుని కాళ్ళూ చేతులూ కలియగట్టేయండి!'' అని తన పరివారాన్ని ఆజ్ఞాపించాడు.

దీనితో యెమేల్యకు కోపం వచ్చేసింది. మెల్లగా ఎవ్వరికీ వినబడకుండా మంత్రం పఠించాడు:

''మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం — ఓ దుడ్డుకర్రా, పిలువని పేరంటానికి వచ్చిన ఈ అతిథికి నువ్వు వెళ్లి వెచ్చవెచ్చగా నాలుగు వడ్డించు! ఓ చీపురు కట్టా, నువ్వువెళ్లి, అతగాడికి దేహశుద్ధి చెయ్యి!''

దుడ్డుకర్ర లేచింది, చీపురుకట్ట చెంగున ఎగిరింది. రెండూ కలిసి మహాసామంతుడిని పట్టుకుని అందరి ఎదుటా మెత్తగా బాదడం మొదలెట్టాయి. మహాసామంతుడు హాత్ హూత్ అని శాపనార్థాలు పెట్టాడు, తిట్లుతిట్టాడు, మొర్రో కుంయ్యో మంటూ గింజుకున్నాడు, నాయనా బాబూ అంటూ దండాలు పెట్టాడు, మొక్కులు మొక్కి క్షమించమని ప్రార్థించాడు.



మహాసామంతుడు గుడిసెలోనుంచి పలాయనం చిత్తగించి, పరివారాన్ని చేరాడు. అందరూ కలిసి మొత్తంగా పిక్కసత్తువ చూపించారు. కాని దుడ్డుకర్ర, చీపురుకట్ట — రెండూ మాత్రం ఒక్క నిమిషమైనా ఆగకుండా వాటి పనిని సాగిస్తూనే వున్నాయి: సాష్టాంగ దండప్రణామాలూ, ప్రార్థన దండకాలూ ఏమీ లాభం లేకపోయాయి — మేం ఎక్కడకూ వెళ్లిపోలేదు, ఇంకా ఇక్కడే వున్నాం సుమా అని చెప్పడానికని, మహాసామంతుని వీపూ బుజాలూ అలా మర్దించుతూనే వున్నాయి. మహాసామంతుడు ఏకంగా రాజప్రాసాదం చేరుకునే



వరకూ కూడా అవి అలా అతగాడిని వెంటతరిమాయి.

మహాసామంతుడు దెబ్బలు తిని తిని, ఇక నడవలేక, పాకుకుంటూ వెళ్లి, రాజుగారికి సంగతులన్నీ నివేదించుకుని:

''ఇదీ జరిగిన వృత్తాంతం! బలప్రయోగం చేసి తీసుకురాలేం వాణ్ణి, ఏదైనా తంత్రం ప్రయోగించే తీసుకురావాలి వాణ్ణి...'' అని విన్నవించుకున్నాడు.

రాజుగారు తన రాయబారికి ఈ పని ఒప్పజెప్పి పంపించాడు: ఈ ఉద్యోగి హోదాలో చిన్న, తెలివితేటల్లో పెద్ద. ఇతడు రకరకాల తీపిరొట్టెలు, పాకంపట్టిన అక్రోటు వుండలు, కల్కండ పుల్కండాలు పట్టించుకుని, యెమేల్య దగ్గరకి వెళ్ళాడు.

రాయబారి యెమేల్య వుంటూన్న పల్లెటూరు చేరుకుని, యెమేల్య వదినెగార్లు ఎక్కడున్నారో కనుక్కుని, వాళ్లను తనదగ్గరకు రప్పించి, వారిని ఇలా ప్రశ్నించాడు:

''మీ యెమేల్యకి ఏమిటంటే ఇష్టం, ఏమిటంటే కోపం?''

''వాడి మీద దాష్టీకం చెలాయించేవాళ్లంటే వాడికి కోపం, వాడితో గౌరవంగా మాట్లాడే వాళ్లంటే వాడికి ఇష్టం'' అని వదినెగార్లు జవాబు చెప్పారు.

సరే అని, రాజుగారి రాయబారి ఆ గుడిసెలోకి వెళ్లి, పొయ్యి తీనె సమీపించి, వంగి వంగి దండాలు పెట్టి:

''నమస్కారం, యెమెల్యాన్ ఇవానిచ్! ఈ తీపిరొట్టెలూ, పాకంపట్టిన అక్రోటు వుండలూ, కల్కండ పుల్కండాలూ తినండి. వీటిని సేవించిన తర్వాత మా రాజుగారి దర్శనానికి దయచేయండి. మిమ్మల్ని ఎప్పుడు చూదునా అని రాజుగారు మహా ఆత్రపడుతున్నారండి!'' అని చెప్పాడు.

''అబ్బా, నే రాను. పొయ్యి తీనె దిగి రావాలని లేదు నాకు!'' అనేశాడు యెమేల్య.



''రాండి, మనం కలిసి వెళ్దాం, యెమెల్యాన్ ఇవానిచ్! మీరు రాకపోతే రాజుగారు నా ప్రాణం తీసేస్తారండి, మీ కారణంగా నాకు శిరచ్ఛేదం తప్పదండి, బాబూ!'' అన్నాడు రాయబారి.

ఆ మాటలు వినేసరికి యెమేల్యకు రాజుగారి రాయబారి మీద జాలి పుట్టి:

''ఐతే, నీ మాటే కానీయ్, నేను వస్తాన్లే. నువ్వు మాత్రం ముందుగా వెళ్లి, రోడ్డు శుభ్రం చేయించి వుంచు, అప్పుడు నీ వెంబడే నే వస్తా'' అన్నాడు యెమేల్య.

రాజుగారి రాయబారి ఈ మాటలు విని, యెమేల్య వదినెగార్లను మెల్లగా ప్రశ్నించాడు:

''వెర్రివెంగళాయ తీరా వస్తానని చెప్పి, తర్వాత నన్ను మోసం చెయ్యడుగద?''

''అబ్బే, వాడు అలా మోసంచేసే మనిషి కానేకాదు. మాట ఇచ్చాడంటే, చేసి తీరాడన్న మాటే!'' అని బదులు చెప్పారు వదినెలు.

రాజుగారి రాయబారి వెళ్లిపోయాడు. కాని యెమేల్య మాత్రం పొయ్యి తినె మీద కాళ్ళు పారజాపుకుని:

''వెచ్చగా వున్న ఈ పొయ్యి తినె దిగడమంటే నాకు మనసొప్ప డంలేదు! ముంగిట మంచు తుపాను హోరుమని కొడుతూ చలి కొరికేస్తూంది!.. నా చేనేత బూర్నీసుకోటు అంతా చిరుగులూ కన్నాలూనూ, ఎక్కడికక్కడికి మాసికలూ తాసికలూనూ... ఓ పొయ్యి తినా! మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం, నన్ను రాజుగారి దగ్గరకు మోసుకుపో!'' అని ఆజ్ఞాపించాడు.

యెమేల్య ఇచ్చిన ఆజ్ఞానుసారం పొయ్యి తినె గుడిసెలోంచి బయటికొచ్చి, ప్రయాణం మీద బయల్దేరి, అస్సు ఇస్సుమని నిట్టూర్చుతూ నడిచింది, పొలాల్లోంచి, పచ్చికబయళ్ల మీదనుంచి, పల్లెపట్టుల మధ్యనుంచి, గ్రామాల నడుమనుంచి నడచుకుంటూ వెళ్లింది. రాజుగారి రాయబారిని దారిలో కలుసుకుని, అతనిని దాటేసి, అతనికంటె ఎంతో ముందే వెళ్లిపోయింది.

పొయ్యి తినె అలా వెళ్లిపోతూనే వుంది, ఇటు మళ్లడంలేదు, అటు మళ్లడంలేదు, ముక్కు సూటిగా సాగిపోతూంది. చిమ్నీ గొట్టంలోంచి పొగమబ్బులు వొత్తుగా ముద్దగా వస్తున్నాయి; యెమేల్య మాత్రం వెచ్చని పొగగొట్టం పక్కని హాయిగా కూచుని పాటలు పాడుకుంటున్నాడు. సరి, పొయ్యి తినె ముఖ్యపట్నం చేరుకుని, సరాసరి రాజప్రాసాదం ఎదుట ఆగింది. ఈ దృశ్యం చూసి మహాపట్నం అంతా ఉద్రేకంతోనూ కోలాహలంతోనూ అట్టుడికినట్టు ఉడికిపోతూంది: జనం ఒకరిమీద ఒకరు పడి కుమ్ముకుంటున్నారు, ఎగబడి చూస్తున్నారు, కుక్కలు మొరుగుతున్నాయి, గుర్రాలు సకిలిస్తున్నాయి, కోడిపుంజులు కొక్కురో కో అని కూస్తున్నాయి...



రాజుగారి బంట్లు ఇదంతా చూసి, ఆయన దగ్గరకు పరుగెత్తి వెళ్లి:

"రాజుగారూ! మహాప్రభో! శీఘ్రంగా దయచేయండి! తమ దర్శనార్థం యెమేల్య వెర్రివెంగళాయ పొయ్యి తీనెపై విజయం చేశాడు!" అని మనవి చేశారు.

రాజుగారు తన కుమార్తెను వెంటబెట్టుకుని, మహాసామంతులు, సామంతులు, సేనాధిపతులు వగైరా పరివార సమేతంగా రాజప్రాసాద ప్రాంగణపు వసారాలోకి వేంచేశాడు.

అప్పుడాయన యెమేల్యను ఇలా ప్రశ్నించాడు:

"గుర్రాన్ని స్లెయ్‌కి కట్టకుండానే ఏ హక్కు ప్రకారం నువ్వు స్లెయ్‌ని తోల్తున్నావురా? నా ప్రజలను నువ్వు ఏ హక్కు ప్రకారం భయభ్రాంతులను చేసేసి వాళ్లని బోల్తాలు కొట్టిస్తున్నావురా?"

యెమేల్య ఇలా జబాబు చెప్పాడు:

"ఏం తప్పు చేశాను నేను? నా స్లెయ్ వెళ్తూంటే వాళ్లు పక్కకు తప్పుకోక, దానికింద పడ్డారు. నువ్వు నన్ను ఆపివుండేవాడివేమో — నీ ఆయుష్యం కూడా అక్కడికి ఆగిపోయుండేది!"

ఇది విని రాజుగారు రౌద్రుడై, తన బంట్లను ఆజ్ఞాపించాడు — యెమేల్యను పొయ్యి తీనె మీదనుంచి కిందకి బరబర ఈడ్చేసి, ఫట్ ఫట్‌మని కొరడాలతో చెమ్డాలూడేటట్టు బాది, బందిఖానాలో తోసేయమని. యెమేల్య ఇది గమనించి — ఇక ఇక్కడుంటే తనకి ఏదో కీడు మూడుతుందని గ్రహించాడు. ఆపాళంగా, మెల్లగా మంత్రం పఠించాడు:

"మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం, ఓ పొయ్యి తీనా! ఇక నువ్వు ఇంటి ముఖం పట్టు; ఓ రాజుగారి కూతురా! నన్ను గాఢంగా ప్రేమించి, నీ తండ్రి నిన్ను నాకిచ్చి పెళ్లి చేసేటట్లు చేయ్!"

పొయ్యి తీనె గిర్రున వెనక్కి తిరిగి, ఇంటి ముఖంగా బయల్దేరింది. అది చూసి, రాజుగారు:

"వాణ్ణి పట్టుకోండి, పొయ్యి తీనె మీదనుంచి బరబరా కిందకు ఈడ్చేయండి, కాళ్లూ చేతులూ కలియగట్టేయండి!" అని హుంకరించాడు. రాజుగారు హుంకరించడమంటే హుంకరించాడు గాని, యెమేల్య



అసలక్కడ వుంటేకద! రాజుగారి దగ్గర సెలవు పుచ్చుకోనూ లేదు, ఆయనకు నమస్కరించనూ లేదు, అక్కడనుంచి సరాసరి బయల్దేరి వచ్చేశాడు యెమేల్య.

పొయ్యి తీనె ఇల్లు చేరుకుంది, గుడిసెలో ప్రవేశించింది, అస్సు ఇస్సుమని నిట్టూర్చుతూ ఆపసోపాలు పడింది, తన మామూలు చోటకి వెళ్లిపోయి, శతాబ్దుల తరబడి తాను ఉన్నచోటునుంచి ఎన్నడూ ఎక్కడకూ కదల నట్టుగా ఆ మూల తన యథాస్థానంలో స్థిరంగా నిలబడిపోయింది.

ఇక అక్కడ రాజుగారి రాజప్రాసాదంలో ఏడుపులూ రాగాలూ ఎగిరిపోతున్నాయి — కన్నీరు కాల్వలు కట్టి ప్రవహించుతూంది.

"యెమేల్యను ఎందుకు బెదరించారు? యెమేల్యను ఎందుకు జడిపించారు? అతడు లేనిదే నేను బతక లేను. నేనతడిని పెళ్లాడుతాను" అంటూ రాజుగారి కుమార్తె తండ్రిమీద దుఃఖపడుతూ, తండ్రికి ఇంకొక మాట యేదీ తోచనీయకుండా ఆయన ప్రాణాలు కొరుక్కుతింది.

రాజుగారికి కూతురి మీద చెడ్డ కోపం వచ్చేసి, గొంతు చించుకుని కూక లేశాడు, పిడికిలి ఝళిపించాడు, కాలు నేల రాశాడు — ఏమి చేసినా లాభం లేకపోయింది: రాజకుమార్తె అహోరాత్రాలు ఏడుస్తూ కూచుంది, కన్ను మూతపడలేదు, తిండి ముట్టలేదు, గుక్కెడు నీళ్లయినా మింగ లేదు, క్షణమైనా నిద్రపోలేదు — మనిషి నీరసించి పోయి, ఎముకల పోగైపోయింది. ఇక చేసేదేమీ లేక — యెమేల్యను తన వద్దకు తీసుకురావాల్సిందని రాజుగారు ఫర్మానా జారీచేశాడు.

"అయితే ఒక్కటి — వాణ్ణి పొయ్యి తీనె మీద మాత్రం తీసుకురాకండి — కింద పడిపోగలడు స్లెయ్‌లో తీసుకురండి. అప్పుడు ఫైసలు చేద్దాం వాడి వ్యవహారం!" అన్నాడు రాజుగారు.

జిత్తులమారి రాయబారి యెమేల్య వున్న పల్లెటూరికి ఎకాయెకీని బయల్దేరి వెళ్లి, కపట వాక్కులతో యెమేల్యను మభ్యపెట్టి, వాడిచేత మత్తుమందు తాగించి, కాళ్ళూ చేతులూ బలంగా గట్టిగా కలియగట్టేసి, స్లెయ్‌లో పడేసి, హుటాహుటిని రాజుగారి దగ్గరకి తీసుకుపోయాడు.





రాయబారి యెమేల్యను రాజుగారి సమక్షాన పడేశాడు. అప్పటికే రాజుగారు పెద్దపీపా ఒకటి తయారు చేయించి సిద్ధంగా వుంచాడు. రాజుగారి బంట్లు యెమేల్యను పట్టుకుని ఆ పీపాలో తోసేశారు. కాని ఇది రాజకుమార్తె కళ్లబడింది. ఆమె తక్షణమే పరుగున వెళ్లి, అమాంతమూ ఆ పీపాను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుని — మరి ఏమి చేసినా, ససేమిరా ఆ పీపాని వదిలింది కాదు.

''యెమేల్య ఎక్కడుంటే నేనూ అక్కడే'' అంటూ రాజకుమార్తె పెద్దపెట్టున గోలచేసింది.

రాజుగారు ఆగ్రహపరవశుడై, ఇక మంచీ చెడ్డా అనే విచక్షణా జ్ఞానం వదలుకుని:

''నువ్వు వెర్రివెంగళాయను అంతగా ప్రేమిస్తే, వాడి గతే నీకూనూ!'' అని శిక్షచెప్పి, రాజకుమార్తెను కూడా ఆ పీపాలో తోసేయమని ఆజ్ఞాపించాడు.

రాజుగారి ఆజ్ఞప్రకారమే అక్షరాలా జరిగింది. రాజుగారి బంట్లు రాజకుమార్తెను పీపాలో తోసేసి, పీపా చుట్టూ ఉక్కు చుట్టలు బలంగా చుట్టి మేకులు కొట్టేసి, పీపాకి మూత బిగించేసి, పీపాకి తారు ఒత్తుగా పూసేసి, పీపాను నడిసముద్రంలో పారేశారు. కెరటాలకి అల్లల్లాడిపోతూ, సముద్రంలో మునుగుతూ తేల్తూ ఆ పీపా అలా కొట్టుకుపోయింది...

కాస్సేపటికి, యెమేల్యను కలియగట్టిన తాళ్లను రాజకుమార్తె విప్పేసి, అతడిని నిద్రనుండి లేపి:

''ఎంత గాఢనిద్రలో వున్నావు నువ్వు, యెమేల్యుష్కా! లే, మేల్కో! మనల్నిద్దరినీ ఈ పీపాలో కుక్కేసి, మహా సముద్రంలో పారేశారు. మనకి తాగేందుకు నీళ్లలేవు, తినేందుకు తిండిలేదు, ఇక పస్తుపడి మనం చచ్చిపోవాల్సిందే!'' అని విలపించింది.

''నిద్రపోయడమంటే నాకెంతో ఇష్టం!'' అన్నాడు యెమేల్య.

''నాకూ ఇష్టమే, కాని ఇప్పుడు మనం నిద్రపోగూడదు! పీపాను ఒడ్డుకు చేర్చేటట్టు నువ్వు దానిని



దొర్లించాలి. నువ్వెంతో తెలివైనవాడివి, నువ్వు అన్ని పనులూ చేయగలవు!'' అంది రాజకుమార్తె.

''సరే, నీ ఇష్టప్రకారమే చేస్తాను'' అన్నాడు యెమేల్య. అలా అని, ''మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం — ఓ పీపా, నువ్వు దొర్లుకుని, పచ్చని పచ్చికబయలు, పసిమి చాయ ఇసుక వున్న ఒడును చేరుకో!'' అని మంత్రం ఉచ్చరించాడు.

మంత్రోచ్చారణ ఇంకా పూర్తి అయిందో లేనేలేదో, అంతట్లోనే పీపా దొర్లుకుంటూ దొర్లుకుంటూ ఒక ద్వీపం చేరుకుని, అక్కడ కట్లు తెంచుకుని విడిపోయింది. పీపాలోంచి ఇద్దరూ బయటికి వచ్చి, పచ్చని పచ్చికబయలూ, పసిమి ఛాయ ఇసుక వున్న ఒడ్డుపై అడుగు పెట్టారు.

రాజకుమార్తె నాలుగు చెరగులా కలియజూసి:



''యెమేల్యుష్క! మనమిద్దరం ఎలా బతకడం? ఇక్కడ పల్లే, పట్నమూ ఏదీ కానరావడంలేదు. మనకొక చిన్నగుడిసె అయినా వుంటే బాగుణ్ను...'' అంది.

''మనకి చిన్న గుడిసె ఖర్మేమిటి?'' అన్నాడు యెమేల్య. ''ఉండు చెప్తాను – మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం, ఇక్కడ మంచి భవనం ఒకటి, రాజుగారి రాజప్రాసాదం కంటె సుందరమైన దివ్యభవనం, ప్రత్యక్షమవాలి!'' అని యెమేల్య మంత్రం ఉచ్చరించాడు.

అలా అనేసరికల్లా – తక్షణమే దివ్యసుందర భవనం ఒకటి సర్వమూ సిద్ధమై తయారుగా భూమిలోంచి లేచి, అక్కడ ప్రత్యక్షమైంది. ప్రపంచంలోకల్లా అత్యాశ్చర్యకరమై, అత్యద్భుతమై, దేదీప్యమానంగా వెలిగిపోతూన్న, వెండి



వసారాలు, బంగారపు బురుజులతో, నలువైపులా శాఖోపశాఖలుగా విస్తరించి వున్న మంటపాలతో విరాజిల్లుతూన్న సప్తస్తంభాల మహాసౌధం ఒకటి అక్కడ వెలసింది. మహాసౌధం చుట్టూ ఉద్యానవనం, ఉద్యానవనంలో తటాకం, అన్ని వైపులా చక్కని చిన్న చిన్న ఇళ్లు. ఉద్యానవనంలో కోయిలలు గానం చేస్తున్నాయి, తటాకంలో రాజహంసలు విహరించుతున్నాయి.

ఆ భవనంలోకి వెళ్ళారు ఇద్దరూనూ. భవనంలోపల మందిరం ఇంకా అద్భుతంగా వుంది: లోకప్పులోంచి సుందరమూర్తి బాలభాస్కరుడు ప్రకాశించాడు; సూర్యరస్మితో సర్వమూ విరాజిల్లుతూంది; రాత్రి చందమామా, తారలూ ప్రత్యక్షమయాయి.



ఈ ద్వీపంలో ఈ మహాసౌధంలో వాళ్లిద్దరూ ఏ లోటూ లేకుండా జీవిస్తున్నారు. — కాని జీవితం మాత్రం విసుగ్గానే గడుస్తూంది: నర వాసన అంటూ ఎక్కడా లేదు.

''బంధువులను ఎవరినైనా కళ్ల చూడాలని వుంది నాకు!'' అని రాజకుమార్తె తన మనసులో వున్న కోర్కెను వెలిబుచ్చింది.

''అయితే సరే. మత్స్య మిత్రుడి మంత్ర మహిమానుసారం, నా చిత్తానుసారం — మహాసముద్రం ఈ వొడ్డునుంచి ఆ వొడ్డుకి ఇనుప వంతెన ఒకటి ఇక్కడ పడాలి! ఆ వంతెన మీదనుంచి మా అన్నయ్యలూ, వదినెలూ ఇక్కడకు రావాలి!'' అన్నాడు యెమేల్య.

మంత్రపఠనం పూర్తి అయేసరికల్లా — మహాసముద్రంపై వారధి ప్రత్యక్షమైంది. వారధికి రెండు వైపులా బంగారు జాలీకట్టుంది, వారధి పైన మరకతమాణిక్యాలతో చేసిన స్తంభాలు తళ్కులు మెరుస్తున్నాయి! ఇక ఆ వంతెన మీదుగా బండి ఒకటి వస్తూంది. బండిలో యెమేల్య అన్నయ్యలూ, వదినెలూ కూచున్నారు. అన్నయ్యలు

సరికొత్త జుబ్బాలు తొడుక్కుని, వడిసెలు పట్టు గాగరాలు కట్టుకుని, పువ్వుల్లా నవ్వులతో తొణికిసలాడున్నారు! వాళ్లందరూ బండిలోంచి దిగగానే, యెమేల్య వారిని కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

''మేమందరం నీ కోసం బెంగపెట్టుకుని, నానా గాబరా పడిపోయి, అన్ని చోట్లా వెతికాం — అడవి అంతా తిరిగాం, చిత్తడి అంతా గాలించాం. నువ్వేమో ఇక్కడున్నావాయె!'' అన్నారు వాళ్ళు.

హఠాత్తుగా వినబడింది — ఫిరంగి ధ్వని. నౌక ఒకటి ద్వీపతీరం చేరుకుంది. నౌకలో రాజుగారు పరివారసమేతంగా ఆసీనుడై వున్నాడు.

''నావికుల్లారా! ఎక్కడికి వెళ్తున్నారు మీరు?'' అని యెమేల్య వారిని ప్రశ్నించాడు.

''కొంతకాలంగా మేం అహర్నిశలూ సముద్రయానం సాగిస్తున్నాం — ఒక పీపా కోసం వెతుకుతున్నాం.''

''ఎందుకని పీపా కోసం వెతుకుతున్నారు?''

''ఎందుకనా? ఆ పీపాలో నా కుమార్తె, యెమేల్య వెర్రివెంగళాయా వున్నారని. నేను మంచీ చెడ్డా అనే విచక్షణా జ్ఞానం వదలుకుని వాళ్లను చంపేద్దామనుకున్నాను...'' అని ప్రత్యుత్తరమిచ్చాడు రాజుగారు.

''ఓహో! అదా కథ? అయితే నాకేసి బాగా చూడు: పొయ్యి తిన్నె మీద నీ దగ్గరకు వచ్చినవాణ్ణి నేనేనా, లేకుంటే మరొకడెవడోనా?'' అని ప్రశ్నించాడు యెమేల్య.

రాజుగారు యెమేల్య కేసి అట్టే తేరి చూశాడు — రాజుగారికి చచ్చినంత భయం పుట్టుకొచ్చింది. రాజుగారు హడలుతూ లేచి, యెమేల్యకి సాష్టాంగ దండప్రణామం ఆచరించి:

''యెమేల్యుష్కా! నన్ను క్షమించు, నాపై కనికరించి నాకు ప్రాణభిక్ష పెట్టు...'' అని యెమేల్యను ప్రార్థించాడు.

''సరేలే'' అన్నాడు యెమేల్య ''ఈ సారికి నిన్ను క్షమిస్తున్నా!''

అప్పుడు రాజకుమార్తె అక్కడకు వచ్చి:

''మా భవనంలోకి దయచేయండి!'' అని వారికి స్వాగతం చెప్పింది.

అందరూ ఆ దివ్యసుందర భవనంలోకి వచ్చి, చక్కని నమూనా అల్లిన గుడ్డ పరచి వున్న ఓక్ టేబిలు చుట్టూ కూచున్నారు. బల్ల మీద రకరకాల భక్ష్యాలు ఎన్నో వున్నాయి. అందరూ సరదాగా భోజనం చేశారు, పానీయాలు సేవించారు, పాటలు పాడారు.

విందులో నేను పాల్గొంటి,
మధు మద్యములూ తాగితి,
అంతా గడ్డముపైనే పోసుకొంటి,
కొంతైనా పోలేదు నోట్లోకి!





అనువాదం: వుప్పల లక్ష్మణరావు

చిత్రాలు: టి. మావ్రిన



ПО ЩУЧЬЕМУ ВЕЛЕНИЮ
русская народная сказка
*На языке телугу*

BY THE WILL OF THE PIKE
Russian Folk Tale
*in Telugu*

సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది



"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో

ప్రథమ ముద్రణ 1965
ద్వితీయ ముద్రణ .1983